# సాలీడు మరియు ఈగ

జర్మన్ మూలం : విలియం లిబ్నిక్
ఆంగ్లానువాదం : డామ్ డెనిమానిస్
తెలుగు అనుసరణ : గౌరవ్



అభివ్యక్తి
ఆంధ్రప్రదేశ్ - తెలంగాణా

# సాలీడు–ఈగ

(The Spider and the Fly)

జర్మన్ మూలం : విలియం లిబ్నిక్

ఆంగ్లానువాదం : డామ్ డెనిమానిస్

తెలుగు అనుసరణ : గౌరవ్

జనవరి 2017



ప్రతిపాదిత చందా : రూ. 5/–

ప్రతులకు : 9032094492

వివరాలకు : gouravmeka@gmail.com



అంతర్జాతీయ విప్లవకారునిగా పేరొందిన విలియం లిబ్నిక్ (1826–1900) నిజానికి మార్క్స్, ఏంగెల్స్‌లకు అత్యంత సన్నిహితుడు. జర్మనీ, స్విట్జర్లాండ్, ఇంగ్లాండ్ మొదలగు దేశాల్లో కార్మికోద్యమాల్ని నిర్మించాడు. సోషలిస్టు పార్టీ స్థాపకుడు. వివిధ పత్రికల వ్యవస్థాపకుడు. విభిన్న శ్రామికోద్యమాలకు కర్త. అనేక ప్రజా ఉద్యమాల నేత. ప్రసిద్ధ విప్లవకారుడు కార్ల్ లిబ్నిక్ ఈయన కుమారుడే. మరిన్ని వివరాలకు చూడండి: www.marxists.org

# మున్నుడి

విలియం లిబ్నిక్ 1889లో పిల్లల కోసం రాసిన కథ యిది. అయినప్పటికీ పెద్దలకీ, ముఖ్యంగా యువతకీ కూడా ఉపయుక్తంగా ఉంటుంది. జర్మనీలోని కార్మికవర్గాన్ని దృష్టిలో ఉంచుకుని దీన్ని చాలా సమర్ధవంతంగా రాసాడు. మిత్రులు ఆజాద్‌షేక్ వద్ద మరాఠీలో 'కోడీ ఆణీ మాషీ' పేరుతో లోకాయత్ సంస్థ ప్రచురించిన ఈ కరపత్రం చూడటం జరిగింది. అనతికాలంలోనే బహుళ జనాదరణ పొందింది. All India Socialist Youth Conference కు పూనా వెళ్ళినప్పుడు ఇంగ్లీష్, హిందీ అనువాదాలు లేవని తెల్సి నిరాశనొందాను. 1972లో మాస్కోలోని ప్రోగ్రెస్ పబ్లిషర్స్ ప్రచురణ ఆధారంగా ఇంటర్‌నెట్‌లో అందుబాటులోనున్న ఈ అనువాదం ప్రచురించబడలేదని ఇలా తెలుగుచేసి మీ ముందుకు తేవడం జరుగుతోంది. తెలుగులో ఇప్పటిదాకా ఇదొచ్చిందో లేదో నాకు తెలియదు. వొచ్చి వున్నా మరోసారిలా తేవడం వల్ల పోయేదేం లేదు. తెలుగులో సాలీడు, సాలె అనే పదాలు కులవృత్తులతో ముడిపడున్నాయి. అయినప్పటికీ వాడుకలోనున్న మాటల్నే వాడే ఉద్దేశంతో దోపిడీకి ప్రతిరూపంగా చిత్రించబడ్డ సాలీడు, పీడనకి చిహ్నంగా చూపబడ్డ ఈగ నేటి సమాజంలోని అసమాన వర్గాలకి రూపాలే కాని జీవులుగా వాట్ని కించపర్చడం రచన ఉద్దేశం కాదని మనవి చేసుకుంటూ, తెలుగులో వొచ్చిన అక్షర దోషాలకూ, వాక్య సమన్వయ లోపాలకూ బాధ్యత నాదేనని పేర్కొంటూ, మరి సెలవు తీసుకుంటాను. – గౌరవ్



అమెరికాలోని వోలింపియా, వాషింగ్టన్‌లో ఏప్రిల్ 10, 1979న పుట్టి పాలస్తీనా ప్రజలకండగా ఉద్యమిస్తూ ఒక కుటుంబం పైకి దూసుకొస్తున్న ఆధిపత్యానికి ఎదురెళ్ళి, మార్చి 16, 2003న ఇజ్రాయిల్ ఆర్మడ్ బుల్‌డోజరు కింద నలిగి నుజ్జునుజ్జయిపోయి అన్యాయాన్ని ప్రశ్నించడానికి, అక్రమాన్ని ధిక్కరించడానికీ సరిహద్దులతో సంబంధం లేదని మరోసారి నిరూపించి మన భగత్‌సింగ్ వారసత్వాన్ని వయసులో సైతం పుణికిపుచ్చుకుని 23 ఏళ్ళకే యుద్ధకాంక్షని వ్యతిరేకిస్తూ అభాగ్యుల కోసం అస్తమించిన ఆత్మీయురాలు రేచల్ కోరీకి... ప్రేమతో...

# సాలీడు - ఈగ

(The Spider and the Fly)

మీకందరికీ అది తెలుసు. బానపొట్టతో, రోమాలతో, జిగటైన వొంటితో, పగటి వెలుతురుని తప్పించుకుంటూ, చీకటి ప్రదేశాల్లో నక్కి నక్కి దాక్కొంటూ, ప్రాణాంతకమైన గూటిని అల్లి, అమాయకమయిన అనాలోచితమయిన ఈగ అజాగ్రత్తగా అందులో చిక్కుకుని చనిపోతే దానిని స్వాహా చేసేది. గుండ్రని గాజుకళ్ళతో, వికారమయిన కాళ్ళతో, నేర్పుగా జీవుల్ని చంపితినే అసహ్యకర భూతం సాలీడు.

అదిగో మెల్లగా, నిశబ్దంగా వోమూల నక్కి క్రూరంగా గూటిని అల్లి బలహీనమయిన, ఆశక్తమయిన, ఈగను మోసంతో పశ్చాత్తాపమనేదే లేకుండా, గుటకాయస్వాహా చేస్తుందది. ఈ చీదర జీవి తన ఎర జారిపోకుండా చివరి దారం వరకూ ఎంతో కష్టపడి అల్లుతుంది. ముందు ఒక్క దారంతో మొదలెట్టి మెల్లగా రెండు, మూడు... అలా చాలా అల్లుతుంది. అది నిలువుగా, అడ్డంగా ఎంతలా తిరుగుతుందంటే, ఆ వ్యూహంలో చిక్కుకున్న ప్రాణి ఎలాగైనా చావాల్సిందేకాని గింజుకుని తప్పించుకోలేదు.

చివరికి ఉచ్చు అల్లబడింది, వ్యూహం సిద్ధమయింది, తప్పించుకోవడం సాధ్యం కాదు - సాలీడు నెమ్మదిగా తన గూట్లో నక్కి నిష్కపటంగా, కడుపుకింత ఆహారం దొరుకుతుందనే తొందరలో తనకి చిక్కబోతున్న ఈగ కోసం ఆతృతగా ఎదురుచూస్తోంది.

ఎక్కువ సమయం ఎదురుచూడకుండానే ఈగ వొచ్చింది. ఆ పిచ్చిప్రాణి పాపం అటూ ఇటూ చూస్తూ కోరలు చాచిన ఆ సాలెవలలో చిక్కుకుంది, ఒక్కసారిగా జడిసిపోయి పిచ్చిగా విదిలించుకోడానికి ప్రయత్నించింది, మరింత చిక్కుబడి పోయింది, అంతే, దాని పని ఐపోయింది.

ఎప్పుడైతే సాలీడు తన ఆహారం చిక్కుబడటం చూసిందో, అప్పుడిక తాపీగా తన స్థావరం విడిచి ఆకలి కళ్ళతో, కబళించే కాళ్ళతో మెల్లగా ఆ బలిజీవిని సమీపిస్తుంది. తొందరేం లేదు, ఒక్కసారి తన వలలో చిక్కుకున్న దురదృష్టప్రాణి ఇక తప్పించుకోలేదని భయంకరమయిన సాలీడుకి బాగా తెల్సు. నెమ్మది నెమ్మదిగా సాలీడు దగ్గరగా మరింత దగ్గరగా వచ్చి చిక్కుకున్న జీవి పరిమాణాన్ని ఎత్తైన కళ్ళతో కొలుచుకుని పిచ్చిగా ఉబ్బి తబ్బిబ్బైపోతుంది. ముంచుకొచ్చిన ముప్పును చూస్తూ వణికిపోయే ఈగ, జిగటగా అంటుకుంటున్న దారాలను విదుల్చుకుని ఎలాగైనా బయటపడి తప్పించుకోవాలని వెర్రిగా అనేకసార్లు ప్రయత్నించి ప్రయత్నించీ అలసిపోతుంది.

దాని యత్నాలన్నీ వృధా అవుతాయి, శ్రమంతా నిష్ఫలమౌతుంది. కలవరంతో అది మరింత లోతుగా దారాలలో చుట్టుకుపోతుంది, సాలీడుకి ఇంకా దగ్గరౌతుంది. తన దేహాన్ని ఇంకా ఎక్కువగా పెనవేసుకుంటున్న దారాల్ని చూస్తుంది, ఆ సాలెగూటి నుంచీ విముక్తి పొందడానికి ప్రయత్నించిన ప్రతిసారీ మరిన్ని దారాలు ధారాళంగా, దట్టంగా చుట్టుకుంటున్న విషయం గ్రహిస్తుంది. ఆఖరికి, శక్తంతాపోయి, శోషించి, క్షీణించి ఊపిరి తీసుకోలేని స్థితిలోనున్న ఈగ తన శత్రువైన సాలీడు దయమీద ఆధారపడుతుంది!

తర్వాత వికారమయిన సాలీడు తన రోమాంచిత కాళ్ళతో ఈగ దగ్గరికి చేరుకుని ప్రాణాంతకమైన కౌగిలిలో దానిని బంధిస్తుంది. దుర్భలమయిన ఆ జీవి శరీరాన్ని కొంచెం కొంచెంగా కొరకడంతో మొదలెట్టి తన ఆకలి ఆధారంగా దాన్ని ఆరగిస్తుంది. ఒక్కసారి బలైన జీవి రక్తంతో దాహం తీర్చుకున్నాక, సగం చచ్చిన ఆ ప్రాణిని అలాగే వదిలేస్తుంది. తిరిగొచ్చి మరోసారి నెత్తురు తాగుతుంది; అలా ఎండిపోయేదాకా కబళించబడిన ఆ ప్రాణి సాలీడుకి తన నెత్తురూ, సారవంతమైన స్రవాలతో నిండిన శరీరాన్ని దఫదఫాలుగా ధారపోస్తూనే ఉంటుంది. అమాయకమయిన ఆ పిచ్చిప్రాణి పూర్తిగా చచ్చేదాకా ఈ తతంగం తరచూ, చాలాసేపు జరుగుతుంటుంది.

ఆ మృతజీవి దేహంలో ఎక్కడో మిగిలిపోయి మినుకుమినుకుమంటున్న జీవాన్ని కూడా కనిపెట్టి పీల్చి కాని వదలదీ రక్తపిశాచి. దాని జీవాన్నీ, శక్తినీ, రక్తాన్ని పీల్చి ఎందుకూ కొరగాని పిప్పిగా దాన్ని వొదిలేస్తుంది.. ఇక తీసుకోడానికి ఏమీ లేదనీ, పీల్చుకున్నా ఏమీ రాదనీ తేటతెల్లమయ్యాక దాన్నలాగే నిర్దాక్షిణీయంగా వదిలేస్తుంది.

అలా పూర్తిగా పీల్చిపిప్పైన ఈగ, పక్షి ఈకలా తేలికై ఉచ్చులోంచి కిందపడుతుంది. నలిగి నాశనమైపోయి ఎండి శిధిలమైపోయిన ఆ ఈగని గాలి తనతోపాటు తీసుకెళ్ళిపోతుంది, అంతే, సర్వం ముగుస్తుంది.

సమృద్ధిగా సంతృప్తి పొందిన సాలీడు తిరిగి దాని స్థావరానికొస్తుంది; దానికి దానితోనూ, ప్రపంచంతోనూ చాలా సంతుష్టిగా అనిపిస్తుంది. యోగ్యులు ఇప్పటికీ తగిన జ్ఞానం పొందుతుండటం చూసి లోకంపై దానికెందుకో ముచ్చటేస్తుంది.

పట్టణాలు, నగరాలు, దేశంలోని శ్రామిక కార్మికులారా, మీరంతా నిత్యం పీల్చి పిప్పి చేయబడి చంపబడుతున్న ఈగలు, ఇతరుల కోసం నెత్తుర్ని ధారపోస్తున్న ఈగలు! మీరు అణగారిన ప్రజలు, మేధావులు, బుద్ధిజీవులు, పారిశ్రామిక కార్మికులు, నలుగుతున్న పనిమనుషులు, అణిచివేయబడ్డ ఆడవాళ్ళు, హక్కులకోసం ధైర్యంగా నిలబడలేనివాళ్ళు, ప్రభుత్వాల యుద్ధకాంక్షకి బలైపోయినవాళ్ళు, ఒక్క మాటలో చెప్పాలంటే పేదలుగా

బతుకీడుస్తూ నిత్యం దోచుకోబడుతున్న వాళ్ళు దేశాన్ని నిర్మించడానికి మీ శక్తినీ, మేధస్సునీ, హృదయాన్నీ అర్పించి, నరాల్లోని బలాన్నంతా సమర్పించి దగాపడి వెలివేయబడి విసిరివేయబడినవాళ్లు, అంతులేని సంపదను సృష్టించి ఆకాశాన్నంటే సౌధాల్ని నిర్మించి చివరికి మౌనంగా ఎందుకూ కొరగాని దిక్కుమాలిన చావు ఏదోమూల చస్తుంటే, మీ చెమట, మీ నెత్తురు, మీ శ్రమ, మీ ఆలోచనలు, మీ జీవితం మొత్తంగా వాడుకున్న యజమానులు మరింత పెరుగుతూ, ఇంకా బలిసి ఎదుగుతూ మరింతగా మిమ్మల్ని దోపిడీచేస్తూ సాలీడుల్లా విస్తరిస్తున్నారు.

యజమానులు, డబ్బు సంచులవాళ్లు, దోపిడీదార్లు, నిర్ణయాలు చేసేవాళ్ళు, బకాసురులతో సహా మనల్ని బానిసల్ని చేస్తున్నవాళ్ళు అంతా సాలీళ్ళే. ప్రజలపై ఆధారపడి, వార్ని పాదాలకింద తొక్కిపెడుతూ, వారి విముక్తి యత్నాల్నీ, దుర్భల బాధల్నీ చూసి ఎగతాళిగా పరిహసించే ప్రతీ ఒక్కరిలోనూ ఒక సాలీడుంది.

అమానుషమయిన చట్టాలకి లొంగి తనకోసం, తన కుటుంబంకోసం దురదృష్టవంతుడైన ఉద్యోగిగా గత్యంతరం లేక బతుకీడుస్తున్న శ్రామికుడు ఈగ. ప్రతీ ఒక్క కార్మికుడి మీదా మేడలు కట్టేంతటి సొమ్మును పిండుకుంటూ కూడా చాలీచాలని బత్తెంతో వారి కడుపులు కొట్టి 12 నుండి 14 గంటల పని చేయించుకుని నామమాత్రపు రూకలు చెల్లించే ఫ్యాక్టరీ యజమాని వో సాలీడు.

కాలుష్యంతో నిండిన గాలిని పీల్చుకుని భూమిలోని ఖనిజ సంపదను వెలికితీయడం కోసం జీవితాన్ని త్యాగం చేసే గని కార్మికుడు ఈగైతే, పెట్టిన డబ్బు రెట్టింపయినా, రెండింతలు, మూడింతలు లాభమొచ్చినా తృప్తి చెందక మరింత పాలు ఆశించి, కార్మికుల శ్రమఫలాన్ని దోచుకుని, వాళ్ళు రవంత జీతం పెంచమని డిమాండ్ చేయడాన్ని జీర్ణించుకోలేక “తిరుగుబాటుదారులకి” దెబ్బలు రుచి చూపించడం కోసం సైన్యాన్ని పిలిపించే షేర్ హోల్డరు సాలెపురుగు.

లేలేత వయసులో ఫ్యాక్టరీకి, వర్క్‌షాపుకీ, ఇంటికీ బానిసైన పిల్లాడు ఈగ కానైతే అయిష్టంగానైనా వారి పిల్లల్ని బలవంతంగా పన్లోకి పంపుతున్న తల్లిదండ్రులు సాలెపురుగులు కారు; ఒక నిండు కుటుంబాన్ని నాశనం చేసేలా వికారాల్ని సృష్టించి సహజ భావనల్ని చంపేసి కఠిన నియమాల్ని బలంతో రుద్దే ఈ దుష్టవ్యవస్తే ఒక సాలీడు.

గౌరవనీయమయిన కుటుంబంలో పుట్టి నిజాయితీగా జీవించాలని తలచి అందుకోసం తనని తాను ఫ్యాక్టరీ యజమాని వికృత కామవాంఛకి బలిచేసుకుని చివరికి కళంకితగా బిరుదొంది బిడ్డతో సహా సమాజం చేత దూషింపబడి క్రూరంగా అవతలికి తోసివేయబడిన స్త్రీమూర్తి ఈగైతే, మాంచి బలిసిన కుటుంబంలో పుట్టి ఖాళీగా జులాయిగా

తిరుగుతూ తెచ్చిపెట్టుకున్న సోకులతో అమాయికమయిన యువతుల్ని లోబర్చుకుని మురికి కూపంలోకి నెట్టేస్తూ వీలైనంతమంది స్త్రీలని అనుభవించడమే, అగౌరవపరిచి అప్రతిష్టపాలు చేయడమే తన ప్రతిష్టకు ప్రధాన చిహ్నమని భావించే ధనిక యువసోగ్గాడు సాలీడు.

తనది కాని భూమిలో తనకి రాని పంట కోసం చెమట చిందిస్తూ భూస్వామిని మేపే నాగలిపట్టుకున్న రైతొక ఈగైతే, నిత్యం రైతుకూలీల్ని పీడిస్తూ, వారి శ్రమను అప్పనంగా వాడుకుంటూ ఒక క్షణం కూడా వార్ని విశ్రాంతి తీసుకోనీకుండా కాపలాకాస్తూ తాను మాత్రం సుఖంగా సోమరిగా జీవిస్తూ నిజాయితీగా చేసిన పని ఫలితమైన దినభత్యాన్ని తగ్గించి కొరత పెట్టాలని చూస్తూ, కౌలు ధరను మాత్రం సంవత్సరానికోమారు పెంచుతూ శ్రామికుల శక్తిని జుర్రుకునే జమీందారొక సాలీడు.

తరతరాలుగా కనిపించని కపటత్వాన్ని దైవం పేరిట పూజిస్తూ, పనికిమాలిన శాపాల్ని భరిస్తూ చర్చి, మసీదు, మందిరాల కీర్తికోసం ఒకరితో ఒకరు కొట్లాడుతూ, ఒకర్నొకరు బానిసల్ని చేసుకుంటూ, వీపుల్నీ మోకాళ్ళని వొంచి మతానికి ఆనందం కలిగిస్తూ, దోపిడీదారులకి ఫలం చేకూర్చడం కోసం వారి దొంగమాటలు నమ్మి, జిత్తులమారి బోధనలపై విశ్వాసం పెంచుకుని ఆధ్యాత్మిక వికలాంగులై, ఐచ్ఛికంగా బలం కోల్పోయి స్వచ్ఛందంగా చాతకాని బతుకులు బతుకుతున్న పేద, సామాన్య ప్రజలంతా ఈగలైతే, నీతికి ప్రతిరూపాల్లా మొహాలేసుకుని మాయమాటలతో, వక్రబుద్ధులతో అమాయక మనసుల్ని గందరగోళపర్చి, అయోమయమైన నీతిబాహ్య బోధనలతో అతి హేయమయిన వినయవిధేయతల్ని జొప్పించడం ద్వారా నిర్మలమయిన హృదయాల్ని కుట్రపూరితంగా విషపూరితం చేస్తూ, దేశాల్ని నాశనం చేసే మతాధిపతులూ, మత బోధకులంతా సాలెపురుగులు.

ఒక్క మాటలో చెప్పాలంటే, దోపిడీకి గురౌతూ, దాసులుగా బతుకుతున్న అణగారిన ప్రజలంతా ఈగైతే, అవినీతితో నిరంకుశంగా క్షుద్రపనులు చేసేవాడు సాలీడు అతడి పేరేమైనా సరే.

భూములపైనా, కోటలు-దుర్గాలు మీదా తన గూటిని అల్లిన సాలీడు ఈరోజు తన వికృతమైన ఉచ్చుని పెద్ద పెద్ద పారిశ్రామిక కేంద్రాలుగా, ఐశ్వర్యవంతమైన భవనాలుగా విస్తరిస్తోంది. పట్టణాల్లోని ఫ్యాక్టరీలలోనూ, చిన్న చిన్న ఊర్లు మొదలుకుని గ్రామాలు, దేశం మొత్తం దోచుకుందుకు సౌకర్యంగా తయారుచేసుకుంటోంది. దోపిడీ, అభివృద్ధి పేరిట వృద్ధినొందే ప్రతీచోటా, కార్మికుడు, ఆస్తీపాస్తీలేని శ్రామికుడు, చిన్న తరహా రైతు, దినకూలీ, చేసిన అప్పుకు కట్టుబడ్డ సన్నకారు వ్యవసాయదారుడు అంతా కళ్ళెంలేని గుర్రాల్లా అడ్డూ అదుపూ లేకుండా బలిపశువుల్లా, కనికరమనేదే తెలీక నిర్దయగా నిర్ణయాలు తీసుకుంటున్న దురాశపూరిత సాలీడు ప్రభువుల పాలవుతున్నారు.

అదెక్కడైనా కానీండి, అది గ్రామమైనా, పట్టణమైనా, దేశమయినా, పేదపురుగులు శత్రువు ఉచ్చులో చిక్కుకుని నిష్ఫలమైన పెనుగులాటలతో పోరాడుతూ, బయటపడలేక అలసిపోయి అశక్తమైపోయి ఎండిపోయి చనిపోతున్నాయి.

బలహీనమయిన పిరికి ఈగకి, క్రూరమయిన రక్తపిశాచి సాలీడుకి మధ్య శతాబ్దాలుగా జరుగుతున్న ఈ యుద్ధంలో భయంకరమయిన బాధాకరమైన గాథలెన్నో అక్షరబద్ధం కావించబడ్డాయి! ఇదో బ్రహ్మాండమయిన దుఃఖభరిత గాథ. దాన్ని మళ్ళీ చెప్పడమెందుకు? అయ్యిందేదో గతంలో అయిపోయింది, ఇప్పుడిక ప్రస్తుత వర్తమానం గురించీ భవిష్యత్తు గురించీ మాట్లాడుకుందాం.

ఈరోజు ఈగకీ–సాలీడుకీ జరుగుతున్న పోరాటాన్ని దగ్గరగా చూద్దాం. పరిస్థితిని బట్టి అవగాహన పెంచుకుని ఈగలన్నీ ఏకమై శత్రుసాలీళ్ళు పన్నుతున్న ఉచ్చులపట్ల అప్రమత్తంగా ఉందాం. వాటి జిత్తులమారి ఎత్తులు ఎల్లప్పుడూ సాగవని నిరూపిద్దాం. అన్నిటికంటే ముందుగా, అందరం ఒక్కటౌదాం. మనల్ని చుట్టుముట్టి, మన మధ్య చిచ్చుపెట్టిన జిత్తులమారిని చిత్తు చేద్దాం. చిక్కుకున్న ఉచ్చుల్ని చేధించడం, దోపిడీదారుల దారాల్ని తెంచుకోవడం ఒంటరిగా, బలహీనంగా సాధ్యంకాదు. అందుకే సమిష్టిగా మనల్ని ఇంతకాలం నిర్భంధించిన శృంకలాల్ని తెంచేద్దాం. కలుగుల్లో నున్న శత్రువులందర్నీ బయటకీడ్చి ఆ దారులన్నింటినీ వెలుతురుతో నింపి హేతుబద్ధమయిన కాంతినక్కడ ప్రతిష్టిద్దాం. అప్పుడిక క్షుద్రజీవులకు చీకట్లో ఘాతుకాలు చేసేందుకు అవకాశం దొరకదు!

ఓ ఈగలూ, మీరనుకుంటే, నిజంగా మీరనుకుంటే, మీరు అజేయులు! నిజం, ఈనాటికీ సాలెపురుగులు శక్తివంతమైనవి కావొచ్చుగానీ అవి కొన్ని మాత్రమే. కొన్ని ప్రభావాల నుంచీ, ప్రలోభాల నుంచీ తప్పించుకోగలిగితే మీ సంఖ్యే ఒక సైన్యం, మీరే మీకు జీవం, మీరే రేపటి ప్రపంచం. ఆకలితో నకనకలాడుతూ, బాధతో మెలికలు తిరుగుతూ అస్తమించే మీరు కనుక ఒక్కసారి, ఒకే ఒక్కసారి ఏకమై ఐక్యంగా ముందడుగేస్తే నేడు మిమ్మల్నిలా సాలెగూళ్ళలో బంధించి ఉంచిన చిక్కుముడుల దారాలన్నింటినీ సమిష్టిగా విదిల్చే ఒక్క రెక్క దెబ్బతో తెంచి పారవేయగలుగుతారు. మీరు నిజంగా కావాలనుకుంటే, బానిసత్వాన్నీ – బీదరికాన్ని బహిష్కరించి ఒక కొత్త ఉదయాన్ని సృష్టించగలుగుతారు.

కాబట్టీ, ముందు, అలా కావాలనుకోవడం నేర్చుకోండి!

---